రూప గుణము తరువాతది సౌందర్యము, గుణా ద్రూప గుణాచ్చాపి, అని నారు మహర్షి. సీత సౌందర్యమును గురించి చెప్పెడి దేమున్నది ?

కావున రాముని ప్రీతి సీతయందు దిన దిన ప్రవర్ధమానమైనది రాముడే సీతయై సీతయే రాముడై వర్ధిల్లినారు దాంపత్య ప్రేమకు ఆదర్శముగ.

ఇప్పుడు మన మయోధ్య నేమనుకొందము? అయోధ్య వైకుంఠము. సీతా రాములు లక్ష్మీనారాయణులు. మన శరీరము అయోధ్య. వైదిక సంస్కారము గల మన విశుద్ధ బుద్ధి సీత. మాయా వచ్ఛిన్న జీవచైతన్య రాముడు.

తయా సరాజర్షి సుతోభిరామయా
సమేయివా నుత్తమరాజకన్యయా
అతీవ రామశ్శుశు భేతికామయా
విభుశ్శ్రియా విష్ణురివామరేశ్వరః

వాల్మీకి మహాశయులు నాటి సీతారాములను నేడు మన కన్నుల ఎదుటబెట్టి, అయోధ్యను చూపి, అయోధ్యయె వైకుంఠమనినారు.

భారతదేశము నందలి మానవుల దాంపత్యము కేవల భౌతిక దృక్పథము ననే లేదు. ఇంటింట నున్న భార్యాభర్తలు పార్వతీ పరమేశ్వరుల ప్రతిబింబములు లేక సీతారాముల ప్రతిబింబములు. కాక లక్ష్మీనారాయణుల ప్రతిబింబములు భగవంతుని ప్రతిబింబ భూతమీ జగత్తని భారతీయ పురాణేతి హాస కావ్య ప్రపంచము ప్రవచించును. చావు పుట్టుకలతో కొట్టుమిట్టాడుచు ఈదరాని సంసారమును ఈది బయట పడదలచిన జీవుల నుద్ధరించదలచినదే రామ కథా నౌకయని వాల్మీకి చాటినారు. ఇంతటితో మన బాలకాండ ఉపన్యాసములు ముగిసినవి. కాని నాకీ నాడొక ప్రత్యేక సంకల్పము కలిగినది.

ఆపదోద్ధారక స్తోత్రము సర్వానర్థ నివృత్తి మూలకము. అది ఆపదామపహర్తారం అను శ్లోకములోని ఆద్యక్షరములతో రామచరిత్రంతయు కలసి వచ్చునట్లు నిర్మితమైన స్తోత్రరాజము. అ స్తోత్ర పఠనముతో ఈనాటి ఉపన్యాసమును ముగింతును. ప్రతి వారును ఈ స్తోత్ర పారాయణము నిట్లు చేసుకొనవచ్చును.

అస్యశ్రీ ఆపదుద్ధారక స్తోత్రస్య। వసిష్ఠో భగవాన్ ఋషిః। అనుష్టుప్ ఛందః శ్రీరామచంద్రోదేవతా। శ్రీంబీజం। రాంశక్తిః మం కీలకం శ్రీరామచంద్ర ప్రసాద సిధ్యర్థే వినియోగః

ధ్యానం

"ఆర్తానా మార్తి హంతారం భీతానాం భయనాశనం
ద్విషతాం కాలదండంచ రామచంద్రం నమామ్యహం
"ఆపదామపహర్తారం దాతారం సర్వ సంపదామ్
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం

[1] అ. పన్న జనరక్షైక దీక్షయామిత తేజసే
నమోస్తు విష్ణవే తుభ్యం రామాయా పన్నివారణే॥

ఇది మొదటి శ్లోకము. ప్రతి శ్లోకముయొక్క చివర, ఆపదామపహర్తారం అను శ్లోకమును చదువవలెను.

[2] ప దాం బోజరజస్పర్శ పవిత్రముని యోషితే
నమోస్తు సీతాపతయే రామాయా పన్నివారిణే॥ ఆపదా

[3] దా నవేంద్ర మహామత్త గజపంచా స్యరూపిణే
నమోస్తు రఘునాథాయ రామాయాపన్నివారిణే॥

(4) మ హిజా కుచసం లగ్న కుంకుమారుణ వక్షసే
నమః కళ్యాణ రూపాయ రామాయపన్నివారిణే॥ ఆపదా

[5] ప ద్మ సంభవ భూతేశముని సంస్తుత కీర్తయే
నమో మార్తాండ వంశాయ రామాయపన్నివారిణే॥ ఆపదా

[6] హ ర్త్యార్తించ లోకానాం యోవా మధునిషూదనః
నమోస్తుహరయే తుభ్యం రామాయాపన్నివారిణే॥ ఆపదా

[7] తా పకారణ సంసార గజసింహ స్వరూపిణే
నమో వేదాంత వేద్యాయ రామాయాపన్నివారిణే॥ ఆపదా

[8] రం గత్తరంగ జలధి గర్వహృచ్ఛర ధారిణే
నమః ప్రతాప రామాయ రామాయాపన్నివారిణే॥ ఆపదా

[9] దా రాసహిత చంద్రావ, తంసధ్యాత స్వమూర్తయే
నమ స్సత్య స్వరూపాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[10] తా రానాయక సంకాశ వదనాయ మహౌజసే
నమోస్తు తాటకా హంత్రే రామాయాపన్నివారిణే॥ ఆపదా

[11] ర  మ్యసానుల సచ్చిత్ర కూటాశ్రమ విహారిణే
నమస్సౌమిత్రసేవ్యాయ రామాయాపన్నివారిణే॥  ఆపదా

[12] స  ర్వ దేవాహితా సక్తదశానన వినాశనే
నమః కలుష సంహర్త్రె రామాయా పన్నివారిణే॥  ఆపదా

[13] ర  త్నసానునివాసైక వంద్యపాదాంబుజాయచ
నమస్త్రైలోక్యనాథాయ రామాయాపన్నివారిణే॥  ఆపదా

[14] సం  సారబంధ మోక్షైక హేతునామ ప్రకాశనే
నమః కలుషసంహర్త్రె రామాయా పన్నివారిణే॥  ఆపదా

[15] ప  వనాశుగ సంక్షిప్త మారీచాది సురారయే
నమో మఖ పరిత్రాత్రే రామాయా పన్నివారిణే॥  ఆపదా

[16] దాం  బికేతర భక్తౌఘ మహదానందదాయినే
నమః కమలనేత్రాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[17] లో  కత్రయో ద్వేగకర కుంభకర్ణ శిరశ్ఛిదే
నమోభీషణ రూపాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[18] కా  కాసురైక నయన హరల్లీలాస్త్ర ధారిణే
నమో భక్తైక వంద్యాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[19] భి  క్షు రూప సమాక్రాంత బలిసర్వైక సంపదే
నమో వామన రూపాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[20] రా  జీవనేత్ర సుస్పంద రుచిరాంగ సురోచిషే
నమః కైవల్య నిధయే రామాయా పన్నివారిణే॥  ఆచదా

[21] మం  దమారుత సంవీత మందార మృదు వాసినే
నమః పల్లవ హస్తాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[22] శ్రీ  కంఠచాపదళనధురీణ బల బాహవే
నమస్సీతాను షక్తాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[23] రా  జరాజ సుహృద్యోషార్చిత మంగళ మూర్తయే
నమ ఇక్ష్వాకు వంశాయ రామాయా పన్నివారిణే॥  ఆపదా

[24] మం జులా ధర్మ వి|ప్రేక్షణోత్సుకైక విలాసినే
నమః పోషిత భక్తాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[25] భూ రిభూ ధర కోదండ మూర్తిర్జేయ స్వరూపిణే
నమః ప్రతాప రూపాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[26] యో గీంద్ర హృత్సరోజాత మధుపాయ మహాత్మనే
నమో రాజాధిరాజాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[27] భూ వరాహ స్వరూపాయ నమోభూతి ప్రదాయినే
నమః కోమలదేహాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[28] యో షాంజలి వినిర్ముక్తలాజాంచితవపుష్మతే
నమస్సౌందర్య నిధయే రామాయా పన్నివారిణే॥ ఆపదా

[29] న ఖకోటి వినిర్భిన్న దైత్యాధిపతి వక్షసే
నమో నృసింహ రూపాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[30] మా యామానుషదేహాయ వేదోద్ధరణ హేతవే
నమోస్తు మత్స్య రూపాయ రామాయా పన్నివారిణే॥

[31] మి తిశూన్య మహాదివ్య మహిమ్నేమానితాత్మనే
నమోబ్రహ్మ స్వరూపాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[32] అహం కారేతర జనస్వాంత సౌధ విహారిణే
నమోస్తు చిత్స్వ రూపాయ రామాయా పన్నివారిణే॥ ఆపదా

[33] "సీతా లక్ష్మణసం శోభి పార్శ్వాయ పరమాత్మనే
నమః పట్టాభిషిక్తాయ రామాయా పన్నివారిణే"॥ ఆపదా

[34] "ఇమం స్తవం భగవతః పఠేద్యః ప్రీతమానసః
ప్రభాతేవా ప్రదోషేవా రామస్య పరమాత్మనః॥

[35] "సతు తీర్త్వా భవాంబోధి మాపదస్సకలాఅపి
రామసా యుజ్యమాప్నోతి దేవదేవ ప్రసాదితః॥

[36] "కారా గృహాది బాధా సుసంప్రాప్తే బహు సంకటే
ఆ పన్ని వారకం స్తోత్రం పఠేద్యస్తు యథా విధి॥

[37] సంయోజ్యానుష్టుభం మంత్ర మనుశ్లోకం స్మరన్విభుః
సప్తాహం సర్వబాధేభ్యో ముచ్యతే నాత్ర సంశయః॥

[38] "ద్వాత్రింశద్వారజపతః ప్రత్యహం సుదృఢ వ్రతః
వై శాఖేభాను మాలోక్య ప్రత్యహం శత సంఖ్యయా।।

[39] "ధనేన ధనద ప్రఖ్యాం లభతేనాత్ర సంశయః
బహూనాత్రకి ము క్తేన యం యం కామయతే నరః।।

[40] "తంతం కామమవాప్నోతి స్తోత్రేణానేన మానవః
యంత్ర పూజా విధానేన జపహోమాది తర్పణైః॥

[41] "యస్తుకుర్వీత సహసా సర్వాన్ కామాన వాప్నుయాత్
ఇహ లోకే సుఖీభూత్వాపరే ముక్తో భవిష్యతి।। ఆపద

ఇది అగస్త్యసంహితాయాం ఉమామహేశ్వర సంవాదే
ఆపదుద్ధారక స్తోత్ర పఠనం నామ ఏకత్రింశోధ్యాయః

ఇది స్తోత్రము దీనిని జపమువలె చేయక బయటకు బిగ్గరగా చేయవలెను/ స్తోత్రము అన్నియు అంతియే.

మనకీ నాటి యుపన్యాసము ముగిసినది. అయోధ్యకాండ రేపు ప్రారంభింప ఎదును.



ధర్మస్యజయోస్తు 
అధర్మస్యనాశోస్తు 
విశ్వస్య కళ్యాణమస్తు 
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః